ఋషికుల బ్రహ్మచర్యాశ్రమము

ఆయుర్వేదము—హారిద్వారము.



వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు.

చెన్నపురి :

55, ఆచారప్పన్‌వీధియందుగల

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారి

స్వకీయాయుర్వేదముద్రాయంత్రమున ముద్రింపబడి

ఆయుర్వేదాశ్రమమున ప్రకటింపంబడియె.

శ్రీః.

ఋషికులబ్రహ్మచర్యాశ్రమాయుర్వేద

వైద్యమహాసమ్మేళనమున కధ్యక్షులగు

# వైద్యరత్న పండిత్ డి. గోపాలాచార్యులు

ఆయుర్వేదమార్తాండ, భిషఙ్మణి, ఎ. వి. యస్. వారి

# యభిభాషణము

హరిద్వారము, (31-5-1917.)

---

"ఓంశన్నో మిత్రశ్శం వరుణః । శన్నో భవత్వర్యమా । శన్న ఇన్ద్రో
బృహస్పతిః । శన్నో విష్ణురురుక్రమః । ......ఓంశాన్తి శ్శాన్తిశ్శాన్తిః॥"

మాన్యులారా! ఆర్యవైద్యవిశారదులారా!

ప్రియనియతబ్రహ్మచర్యులారా! నారీమతల్లికలారా!

శ్రీమదుత్తుంగ తుహినగిరి శిఖరమాలావిరాజితంబును, శీతలమందమారుతసేవితంబును, త్రిలోకపావనియగు గంగాతరంగిణీవీచికలచే నపనీతకలుషంబును, మునికులసమాశ్రయంబును నగు నీహిమాచల ప్రాంతప్రదేశమున వేదవేదాంగపారగులును సకలకలాకోవిదులును విమలవిజ్ఞాన తేజఃపుంజవిరాజితులును విద్వద్వైద్యపుంగవులునైన పండితావతంసులచే నలంకృతంబగు నీ ఋషికుల బ్రహ్మచర్యాశ్రమంబున యాయుర్వేద మహా

సమ్మేళనమును నిర్వహింప నఖిలభారత వైద్యసేవాసమితివారు నన్ను గోరియుండిరి.

ఋషిపుంగవుల మహిమలకునికిపట్టయిన యీప్రదేశమున నీసమ్మేళనకార్యమును నిర్వహింప నాకన్న జ్ఞానవయోవృద్ధు లనేకులున్నను ఋషికుల బ్రహ్మచర్యాశ్రమ మండలివారు సాదరముగ నన్నాహ్వానము చేసినపుడు నేనికార్యము నకు బూనుకొనుట సాహసకృత్యమని సంశయించితిని. అయినను బూర్వకాలమున అంగిరసులు, భరద్వాజుడు, ఆత్రేయులు మున్నగు నాయుర్వేదాచార్యులు హిమాచలప్రాంతమందలి యీఋషికులప్రదేశమున నాయుర్వేదమునుగూర్చి చర్చించిరను గాథను చరకమువలన తెలిసియుండుటచేసి యట్టియాయుర్వేదీయవిషయముల నిర్ణయించుక యుపన్యసింప నౌత్సుక్యముగలవాడనై ప్రాచీనార్యఋషిపుంగవులయొక్కయు వైద్యవిద్యావిశారదులును వేదవేదాంగపారగులునునగు మీయందరియొక్కయు నవ్యాజకరుణచే నేనీసభానాయకత్వమును బూన మీకందరకును దానునిగనుండ నవకాశము గలుగునని మిక్కిలి సంతసముప్పొంగ నెట్టకేలకు తమనియోగము నెరవేర్చుటకు సమకట్టితి. బ్రహ్మతేజోవిరాజమానులైన సభాసదులగు మీయందఱి యవ్యాజకరుణయే బాసటయైయుండునని నమ్ముచున్నాను.

## —॥ శ్రీజార్జిచక్రవర్తిప్రశంస. ॥—

న్యాయైకదీక్షాధురంధరుడును మనభారత సార్వభౌముడునునగు శ్రీపంచమజార్జిచక్రవర్తిగారు అకాండసమాపతిత



మగు నీఘోరసంగరమున శీఘ్రముననే జయశ్రీసనాథులగు
టకై యాశ్రియఃపతిని బ్రార్థించెదను.

—{ స్వర్గీయస్మరణ. }—

వైద్యసోదరులారా! భారతదేశమునందలి విషౌషధముల గూర్చియు నితరౌషధములఁగూర్చియు విపులముగఁ జర్చించి వాని స్వరూపగుణాదుల బోధించు చిత్రపటాదులతోఁ గూడిన గ్రంథముల రచియించి యాయుర్వేదౌషధుల నుద్ధరించినవారును, హిందూమహావిశ్వవిద్యాలయ శంకుస్థాపనమహోత్సవసమయమున గడచిన నూరువత్సరములనుండి వృద్ధిగాంచిన వైద్యమునుగూర్చి యుపన్యసించినవారును, కర్నల్ జాక్సన్ గారి వితండవాదమును ఖండించినవారును, మధురానగరమున పంచమాఖిల భారతాయుర్వేద మహాసమ్మేళనమును జయప్రదముగ నడపినవారునునగు శ్రీకర్నల్ కే. ఆర్. కీర్తికర్, ఐ. యమ్. యస్ గారు ఈ మహోత్సాహసమయమున మనలం గలసియుండక పరంధాముని పదారవిందముల సేవయొనర్చుట కరిగినందులకు మనకందఱకును మిక్కిలి విచారస్థానమై యుండుటయేకాక మనయాయుర్వేదమునకును నాయుర్వేద వైద్యసోదరులకును గలిగిన నష్టము లింతింతయని చెప్ప నోరాడకున్నయది. జ్ఞానవయోవృద్ధులగు నీమహానీయుని యంతరాత్మకు శాంతిగలిగింప నాశ్రియఃపతిని మనమందరము ప్రార్థింతము.

—॥ వేదములు. ఆయుర్వేదము. ॥—

అష్టాంగవిశిష్టమగు నాయుర్వేదము "యువంచ్యవానమ శ్వినా జరన్తమ్ పునర్యువానం చక్రథుశ్శచీభిః" ఋగ్వేదము. 1-116-15. "సద్యో జంఘామాయసీం విశ్పలాయై ధనే హితే సర్తవే ప్రత్యధత్తమ్" ఋగ్వేదము. 1-116-18. "త్రిధాహ శ్యావ మశ్వినా వికస్తముజ్జీవస ఐరయతం సుదానూ" ఋగ్వేదము. 1-117-24. "ఆధేనుం దస్రా స్తర్యం విషక్తామపిన్వతం శయవే అశ్వినా గామ్" 1-117-20. "యజ్ఞస్య శిరోఽచ్ఛిద్యత తే దేవాః......శిరఃప్రత్యధత్తాం" "త్రిధాతుశ్శర్మ వహతం శుభస్పతీ" "ప్రతేభినద్మి మేహనమ్" "నక్తం జాతాస్యోషధే రామే కృష్ణే అసిక్నిచ" అధర్వణము. ఇవి మున్నగు వేదవాక్యములచే రసాయనతన్త్రము, శాలాక్యతన్త్రము, శల్యతన్త్రము, కాయచికిత్స, మున్నగునవి ఋగ్వేదాదులందు బోధింపబడుటంజేసి యనాదియనియు అపౌరుషేయమనియు కేవలమార్షమనియు స్ఫుటముగ దెలియుచున్నది. మరియు నిందలి విభాగములును కాయశస్త్రాది చికిత్సలును లోకవిదితములు. వీనిని గుఱించి పలుదడవ లనేకులచే జర్చింపఁబడియున్నది. దానిని మరలఁ జర్చించుట యనవసరము; అయినను గొన్ని ముఖ్యములగు సిద్ధాంతములను విమర్శించి చూపెదను.

—॥ త్రిదోషతత్వము. ॥—

ఆయుర్వేద మనునది వాత పిత్త కఫములనుఁ ద్రిదోషము లతోఁగూడిన చికిత్సాశాస్త్రమనునది లోకవిదితము. ఈత్రిదో

షములయొక్క న్యూనాధిక్యములచే శరీరమున రోగములు గలుగుననియు వాని సమతయే యారోగ్యమనియు సిద్ధాంతము. ఈమూడు దోషములును శరీరముయొక్క జన్మనిధనములకు మూలభూతములనియు విశేషముగ శక్తి విశేషములనియు వాని న్యూనాధిక్యములను సమతను వానిచేఁ గనుపరుపఁబడిన కృత్యములఁబట్టి తెలిసికొనవలెననియు జరకసూత్రస్థానమున వాతకలాకలీయాధ్యాయమునఁ జెప్పఁబడియున్నది.

పైవిమర్శనమునుండి లోకమున 'వాతము' స్పర్శేంద్రియగోచరమగు గాలియనియు (విండు Wind), పిత్తము ద్రవరూపమగు పసరనియు (బైల్ Bile), శ్లేష్మము తెల్లనై జిగటగనుండు కఫమనియు (ఫ్లెమ్ Phlegm), జులకనగఁ బలుకఁబడునవి త్రిదోషములుగావని స్పష్టమగుచున్నది. మఱియు మిథ్యాహార విహారాదిసేవనముచే రోగసామాన్యముయొక్క పుట్టుకకీమూడుదోషములే కారణములని బోధించుచున్నది. ఇక్కాలపుఁ బాశ్చాత్యపద్ధతులవారు ఏదోయొకవ్యాధికి నొక కారణమును స్థిరపరచి దానినే వేరొకనాఁడు మఱియొక కారణముఁజూపి నిరసించెదరు. ఈ త్రిదోషపద్ధతి నవలంబించిన రోగజ్ఞానోపాయములు అటుగాక స్థిరములుగను నిశ్చితములుగను గన్పట్టుచున్నవి.

ఆయుర్వేదము అనుభవముచేఁ గనిపెట్టినదియేకాని (ఎమ్పైరికల్ Empirical) సిద్ధాంతమగు శాస్త్రము

(సైన్సు Science) గాదని కొందరువాదించెదరు. లోకమున నుండు చికిత్సాశాస్త్ర సామాన్యము వారివారి యనుభవమున గనిపెట్టినదియే కాని వేరుకాదు. ఆకనిపెట్టుమార్గముల భేదములుండవచ్చును. ఎట్టులన కొన్నివస్తువుల గొందరు కోతులకును, కొందరు కుక్కలకును, మఱికొంద రితరజంతువులకును, కొందరు మనుజులకును బలుమారుపయోగించి సమయభేదములయందవి చేయుపనుల గుర్తించుచు వానిని సిద్ధాంతపరచెదరు. ప్రాయికముగ లోకమునందలి శాస్త్రమర్యాద యిట్టిదియైయున్నది. ఇయ్యదియే పదుగురచే వాడబడిన శాస్త్రమనంబడును.

ముందటికాలమున నాయుర్వేదవేత్తలు లోకమందలి త్రివిధసృష్టిలోఁజేరిన ఖనిజ (బంగారు మొదలగు లోహములు రత్నములు మొదలగునవి) ప్రాణిజ (పశుపక్ష్యాది జంతువులును కస్తూరి గోరోజనము మొదలగునవియు) ఉద్భిజ్జ (మూలికలు) పదార్థసామాన్యముల నౌషధరూపములుగ గనుఁగొనుటకై కొన్ని సిద్ధాంతములఁ జూపియున్నారు. మునుముందు పదార్థసామాన్యమును దాని స్వస్వరూపములఁ దెలిసికొనుటకై ప్రమాణ, వర్ణ, ఆకృతి, నామ, జాతులను నైదువిధములగు నుపాయములచే బాహ్యేంద్రియములనుండి వస్తునిర్ణయము జేయుచుండిరి. పిదప రసవీర్య విపాక ప్రభావములచేతను దీపని, పాచని, గ్రాహి, స్రంసని, యనులోమని, రసాయని యను నవి మున్నగాఁగల పలువిధములగు శక్తులచేతను వానిగుణముల గనిపెట్టుచుండిరి. పదార్థములయందలి రసవీర్య విపాకా

దులనుండియే త్రిదోషజన్య రోగములను స్వస్థపరచువిధమును దోషసామ్యతను గలిగించుపద్ధతిని గనుగొనిరి. పురాతనకాలమున ప్రాచీనులగు నాయుర్వేదవేత్తలచేఁ గనుఁగొనఁబడిన రసవీర్యవిపాకాదులు నేటికిని మారకున్నయవి. ఎట్టులన!— హారీతకి కషాయరసమనియు, శుంఠి కటురసమనియు, జిత్రమూల ముష్ణవీర్యమనియు, జెరకు మధురవిపాకమనియుఁ దెలిపియున్నారు. అయ్యవి కషాయరసము మధుర రసముగను, ఉష్ణవీర్యము శీతవీర్యముగను, మధురవిపాకము కటువిపాకముగను నొకప్పుడును మారియుండవు. దీనిచేతనే యాకాలమున నాయుర్వేదవేత్తల పరిశోధన లెట్టియౌన్నత్యమున నుండునవియు బోధపడగలదు.

మఱియు బదార్థములయందలి రసవీర్యములకన్న 'విపాకము' అనుశక్తివిశేషమును త్రికాలవేత్తలగు మహర్షు లెట్లు కనుగొనియుండినదియు నూహింప నసాధ్యమైయున్నది. ఏలయన :—విపాకమనునది భుజింపఁబడిన షడ్రసవిశిష్టములగు బదార్థములయొక్కయు జీర్ణానంతరమునఁ గలుగును. ఈ విపాకమును వారౌషధములుగ గ్రహించిన పదార్థముల కన్నింటికిని దెలిపియున్నారు. దీని వినిర్ణయము ఇప్పటికిని సిద్ధాంతముగనున్నయది. దీనిఁ బరిశీలించిచూడ ప్రాచీనవైద్యులకు శారీరక విభాగముల (అనాటమీ, ఫిజియాలజీ,) యందును, కెమిస్టరీ (పదార్థవిజ్ఞానాది శాస్త్రము) విభాగములయందును నెంతటి పరిజ్ఞానము గలిగియుందురోయని యిప్పటివారి కాశ్చ

ర్యము గలుగకమానదు. ఆయుర్వేదవేత్తలు పదార్థములును వానియందలి రసవీర్యవిపాకాదులును వానిగుణములును వానికిని దోషసామ్యమునకును గల సంబంధమును బహువిధపరిశోధనములనుండి తెలిసికొని యెల్లరకు తెలిపియుండ వానిని గనుంగొనలేక యధునాతనవైద్యు లాయుర్వేదము ఆధారరహితము (ఎమ్పెరికల్ Empirical) అనిపలుకుట చోద్యముగదా!

మనపురాతనపరిశోధకులను పరిశోధనములను గూర్చి స్తోత్రముచేసికొనుటకంటె మనప్రతిపక్షుల పలుకులనుండి మన సిద్ధాంతమును స్థిరపరచినచో నతిశయోక్తి కాఁజాలదని తలచి వానిఁ గొన్నిఁటినిటఁజూపెద:—గతవత్సరమున మనసార్వభౌముని శాసనసభయందు ఆనరబిల్ నబాబ్ అసదల్లీఖాఁ సాహేబు బహద్దర్ గారు ఆయుర్వేదవిషయములఁగూర్చి విమర్శించుఁదరుణమున ఇండియన్ మెడికల్ డైరక్టర్ జెనరల్ వారగు సర్ పాడీ ల్యూకీన్ దొరవారు "లోకమున వైద్యశాస్త్ర సామాన్యము అనుభవమువలననే కనుగొనవలసినదియేకాని సిద్ధాంతశాస్త్రము కాదనియు, పూర్వకాలమున నాయుర్వేదజ్ఞులు వారివారి శోధనములనుండియు ననుభవమునుండియు లవణము శోథరోగముల కపథ్యమనియు మకరధ్వజము రసాయనమనియుఁ దెలిపినవిషయములు ఇప్పటి వైద్యపద్ధతులవారికిఁ దెలిసియుండలేదనియు, నిట్టి యనేకవిషయముల నాయుర్వేదమునుండి ప్రకృతపు వైద్యపద్ధతివారు తెలిసికొనవలసియున్నది" అని

ఘంటాపథమ్ముగ నుడివిరనుట యెల్లరకును స్పష్టముగఁ దెలిసి యేయున్నది.

మఱియు నుశ్రుతమునఁగల బద్ధగుదోదరము, పరిస్రావ్యుదరము, మూఢగర్భము, అశ్మరి, తిమిరము, మొదలగు రోగముల నుద్దేశించి చెప్పిన శస్త్రచికిత్సాపద్ధతులు ఆయుర్వేదమునంగల శస్త్రచికిత్సలయౌత్కృష్ట్యమును బహుభంగుల చాటుచున్నవి. శస్త్రచికిత్సలకై వినియోగింపఁబడు యంత్రములు శస్త్రములు మున్నగు సాధనము లిప్పటి నవీనపద్ధతుల వారి సాధనములకన్న ప్రాచీనము లగునవియే యుత్తమము లని కలకత్తాయందలి డాక్టర్ గిరీంద్రనాథ ముఖోపాధ్యాయులవారి గ్రంథముచేఁ దెలియుచున్నది.

ఇక్కాలపువారు నవీనముగఁ గనిపెట్టిరని తలపఁబడు రక్తచలనము క్రీస్తుశకమునకుఁ గొన్నివందల వత్సరములకు పూర్వమే చరకసూత్రస్థానమున ముప్పదియవ యధ్యాయమునఁ *గనుపరుపఁబడినది. ఈవిషయమును వినినచో భారతీయులలో నేరికి సంతస ముప్పొంగదు?

ఆయుర్వేదముయొక్క యుత్కృష్టతఁగూర్చియు నందలి విషయవిశేషములఁగూర్చియుఁ దెలుపవలెనన్న నెన్నియో గలవు. అందు దిఙ్మాత్రముగఁ గొన్నిటిఁ జూపినాఁడను.

—॥ ఆయుర్వేదము - క్రమాభివృద్ధి. ॥—

అపౌరుషేయమై యష్టాంగవిశిష్టమగు నీయాయుర్వేదము క్రీస్తుశకమునకుఁ గొన్నివందల వత్సరములకుఁ బూ

*“తేన మూలేన మహతా మహామూలా మతా దశ। ఓజోవహాశ్శరీరేస్మిన్ విధమ్యన్తే సమన్తతః। యేనౌజసా వర్తయన్తి ప్రీణితాస్సర్వజన్తవః। యదృతే సర్వభూతానాం జీవితం నావతిష్ఠతే। యత్సారమాదౌ గర్భస్య యత్తద్గర్భరసాద్రసః। సంవర్తమానం హృదయం సమావిశతి యత్పురా” ఇత్యాది

ర్వము చరకవిద్యాపీఠమునను, పిదప (400 A. D.) కాలమున సుశ్రుతవిద్యాపీఠమునను యుత్తరాపథమున నభివృద్ధి గాంచినది. దక్షిణాపథమునఁ గ్రైస్తవశకమునకుఁ జిరకాలముపూర్వము అగస్త్యవిద్యాపీఠమున నభివృద్ధినొందినది. పిదప వాగ్భట (500 A. D.) మాధవకర (600 A. D.) బృందమాధవ, చక్రదత్తప్రభృతు లుత్తరాపథమునను, పూజ్యపాద (400 A. D.) ఉగ్రాదిత్య (800 A. D.) హస్తిచారిప్రభృతులు దక్షిణాపథమునను నభివృద్ధి నొందించిరి. ఈయభివృద్ధి క్రైస్తవ పదమూడవ శతాబ్దమువరకు నున్నట్లు తెలియుచున్నది. 300 B. C. మొదలు 1300 A. D. వరకు గల మధ్యకాలమునం దష్టాంగవిశిష్టమగు నాయుర్వేద వాఙ్మయము కొంతవరకు నభివృద్ధి గాంచినది. పిదప 1400 A. D. మొదలు శార్ఙ్గధర భావమిశ్రాదు లుత్తరాపథమునను, వల్లభేంద్రబసవరాజాదులు దక్షిణాపథమునను, నవీనవిషయములతోఁ జేర్చి కొంతవఱకు నాయుర్వేదమును బోషించుచుండిరి. ఈమధ్యకాలముననే యాయుర్వేద వాఙ్మయము కొంతవరకు దేశభాషల నలంకరించియున్నది. అందు దక్షిణాపథమునంగల ద్రవిడభాషయం దీవాఙ్మయము తొలుత నతవరించినట్లు తెలియుచున్నది.

పైఁజెప్పినరీతిఁ జరకాదుల కాలమునుండి యభివృద్ధినందుచువచ్చిన యాయుర్వేదము రాజావలంబనము లేకుండుటమున్నగు ననేక కారణములచే నప్పుడప్పుడు క్షీణదశనొందుచు మధ్యకాలమునఁ గొంచెము కొంచెముగఁ దలయెత్తుచుండెన

నుట సర్వజనవిదితము. ఇట్టి దీనదశ ననుభవించుచుండు నా యుర్వేదమును మరల నుద్ధరింప దేశబాంధవులు కొందరు మొదలిడిరి.

—( ఆయుర్వేదీయచికిత్సలు - వానిసులభత - ఫలాధిక్యము. )—

ఆయుర్వేదమున బోధితములగు చికిత్సలన్నియు ఖనిజ, ప్రాణిజ, కాష్ఠౌషధముల నాశ్రయించియున్నవి. వీనిని గుర్తించు నుపాయములను ఔషధరూపములుగఁ గనుగొను నుపాయములను పైనఁ గొంతవఱకు వివరముగఁ దెలిపియుంటిని. ఔషధములకై యుపయోగింపఁదగిన పదార్థములన్నియు భారతదేశముననే దొరకునవిగనున్నవి. ఇయ్యవి మనశీతోష్ణస్థితుల ననుసరించి మనతోఁగూడ నీభారతదేశమునఁ బుట్టియున్నవి.

—( కాష్ఠౌషధములు. )—

. అందు కాష్ఠౌషధుల (మూలికల)ను కల్క క్వాథ లేహ్య చూర్ణ ఆసవ అరిష్టాద్యౌషధరూపముల నందించుటకై గొప్ప కర్మాగారము లనవసరములు. ఆయావైద్యునియొక్క ద్రవ్యోపపత్తి ననుసరించి యౌషధరూపముల నందించు ప్రక్రియలు మహర్షులచేఁ గనిపెట్టఁబడియున్నవి. మఱియు నీయౌషధములు సిద్ధములుగ లేవనుటకు సందులేక యతిశీఘ్రముగ సిద్ధపరుప వీలుగనున్నవి. ఇంతసులభముగ నౌషధములఁ జేయు ప్రక్రియ లితర వైద్యశాస్త్రములఁ గానరావని చెప్పవచ్చును. మఱియు నొకప్పుడు ఓషధిని చూర్ణాదిరూపముల నందింపక

మెట్లు పుట్టినదో యట్లుగనే యౌషధముగ నుపయోగింపదగు నవియుఁ గొన్ని కలవు. సులభములగు నిట్టి చికిత్సాప్రక్రియ లెన్నియో చరక సుశ్రుతముల బోధింపఁబడియున్నవి. చరకమునందలి చికిత్సల యుత్కృష్టతనుగూర్చి యమెరికాదేశమున డాక్టర్ క్లార్కు అనువా రిట్లు కొనియాడిరి :—“ ఇకాలమున నింగ్లీషుపద్ధతి ననుసరించి చికిత్సఁ జేయువారందరు తాము వాడు మందులనువిడచి చరకమునఁ జెప్పినరీతి వైద్యముఁ జేసిన యెడల దీర్ఘవ్యాధులసంఖ్య తగ్గుటయేకాక శవవాహకులకు గూడఁ బని తక్కువయగు” నని నుడివిరి.

—⁅ ఖనిజమిశ్రౌషధములు - వాని పరిశోధనములు. ⁆—

ఖనిజములను ‘ లోహములు, రత్నములు, మహారసములు, సాధారణరసములు ’ అని విభజించిరి. వీనిని శోధన, మారణ, సత్వపాతన, ద్రవీకరణములచే నౌషధములఁ జేయు పద్ధతులఁ దెలిసికొనిరి. ఇందు అభ్రికము, లోహము, రత్నములు మొదలగువాని మేళనమున నాయావ్యాధులఁ బోగొట్టఁదగిన యౌషధములఁ గనుగొనిరి. వీనిని జేయుటకై కావలసిన వాలుకా విద్యాధరాదియంత్రములను మూషాదులను గనిపెట్టిరి. వీనిఁ బరిశోధించుటకై చక్కని రసశాలలను నెలకొల్పిరి. అందు శాస్త్రపద్ధతులఁ జవఁదాటక స్వయముగఁ బెక్కుపరిశోధనములఁ జేయుచున్నట్లు రసార్ణవ రసరత్నాకరాది గ్రంథములఁగల యీక్రింది శ్లోకములనుండి తెలియుచున్నది :—

"స్వాహ స్తేన కృతం సమ్యక్ జారణం న శ్రుతం మయా। స్వాహ స్తభవయోగేన కృతం సమ్యక్ శ్రుతేన హి। ధాతుబద్ధ స్తృతీయోసౌ స్వాహ స్తేన కృతో మయా।దృష్టప్రత్యయ యోగోయం కథితో న్యాత్ర సంశయః" అని రసార్ణవమునను, "యద్యద్గురుముఖాత్ జ్ఞాతం స్వానుభూతం చ యన్మయా। తత్తు లోకహితార్థాయ ప్రకటీ క్రియతేఽధునా" అని రసార్ణవమునను జెప్పియున్నది.

—॥ సిద్ధౌషధపరిజ్ఞానము. ॥—

మరియు సిద్ధౌషధములఁ బరీక్షించు నుపాయములు కేళది బసవ భూపాలవిరచితమగు శివతత్వరత్నాకరము మున్నగు గ్రన్థములయం దిత్తెరంగునఁ జెప్పఁబడినవి:—"వల్మీకశిఖరాకారం భఙ్గే నీలోత్పలద్యుతి। ఘర్షణే రక్తవర్ణం స్యాత్ సిన్దూరం తత్ప్రశస్యతే। లఘు వారితరం తీక్ష్ణం వసన్తకుసుమాకరమ్" ఇవి మున్నగు శ్లోకములచే మాలినీవసన్తము, భూపతి, లక్ష్మీవిలాసరసము, చన్ద్రోదయరసము మున్నగు పెక్కుసిద్ధౌషధముల లక్షణములుఁ గానంబడుచున్నవి.

ఖనిజౌషధములఁ జేరిన భస్మసిందూరములు సత్త్వపాతనముల్ను పాషాణాదిశోధనములు మున్నగుఁ బ్రక్రియల మున్ముందు ప్రపంచమునకుఁ జూపినది యాయుర్వేద రసతంత్ర కోవిదుల నుటకు సందియము లేదు. రసతంత్రమునఁ బ్రధానమయిన పారదమును సంస్కారము నందించుటకై యనేకములగు యంత్ర

ములు మున్నగువానిని కనిపెట్టి వానినుండి ప్రపంచమునకుఁ బలువిధముల పారద ముపయోగించునట్లు తెలిసికొనినదియు నీరసతంత్రకోవిదులే యనుట లోకవిదితము. ఇట్టి వివరంబును వాని ప్రాచీనతయు ప్రొఫెసర్. పి. సి. రాయ్‌గారి 'హిందూ కెమిస్ట్రీ' నుండి తెలియుచున్నది. మఱియు ఖనిజములచేఁ జే యంబడిన మహారాజమృగాంకము మున్నగు నౌషధముల మహిమ జగద్విదితము. ఈ యౌషధము లెంతపురాతనము లైన నంతకును వానిశక్తి హెచ్చుచుండునని తెలియుచున్నది. ఇప్పటికి నైదారువందల వత్సరములకుఁ బూర్వము మనస్వదేశ సంస్థానములఁ జేయఁబడిన యౌషధము లిప్పటికిని వాడుకలో నున్నవి. ఇట్టి పద్ధతి లోకమున నేవైద్యతంత్రజ్ఞులకును నీ యిరు వదియవ శతాబ్దమునఁగూడఁ దెలిసియుండలేదు.

—: జాంతవమిశ్రఖనిజాద్యౌషధములు. :—

ఇంతదనుక రసతంత్రమునందలి చికిత్సాభాగమునకుం బ్రధానములగు నౌషధములఁ దెలిపినాఁడను. ఇఁక వానితోఁగూడఁ బ్రాణిజసంబంధములగుఁ బంచపిత్తములు, కస్తూరి, అంబర్, సర్పవిషము మొదలగు సమూల్యవస్తువుల మేళనముచే సిద్ధములగు నౌషధములఁ గొన్నిటిసూచించెద. పైవస్తువుల సమ్మేళనముచే సిద్ధములగు సూచికాభరణము సూచీముఖరసము పాశుపతాస్త్రరసము మొదలగు నౌషధరాజములు పెక్కులుఁగలవు. వీనిని సూచీముఖమునుండి సన్నిపాతాదులయందు వినియోగించుటచే నమూల్యగుణముఁ గలుగునని యీ క్రింది వాక్యములచేఁ దెలి

యుచున్నది:—“సన్నిపాతేన తీవ్రేణ మూర్ఛాతోః భాగతస్య చ। తాలుని ప్రచ్ఛయిత్వాఽథ రసమేనం వినిక్షిపేత్।సూచ్యా తిసూక్ష్మయా తోయాభిన్న యాఽతిప్రయత్నతః। తతస్తైలేన సంలిప్త్వా సివాతే,సన్నివేశయేత్” అని సూచికాభరణ యోగమునఁ దెలిపియున్నది. మఱియు రసరత్నసముచ్చయ మున సూచీముఖరసము నుపయోగపరచురీతిని “బ్రహ్మద్వార వికీర్ణలోహితతలే గుంజైకమాత్రం దదేత్” అని తెలిపియు న్నాఁడు. ఇట్టివి యనేకప్రయోగములు రసతంత్రములఁ గన్పట్టు చున్నయవి. ఈ రసౌషధ విధానము లితర వైద్యతంత్రములఁ గానరావని మఱియొకతూరి నుడివినను విషాదముకలుగదని తలఁ చెదను. వీనినిర్మాణమున కావశ్యకములగు యంత్రాది సాధన ములు పదార్థములు మున్నగువానిని సంపాదించుటకై భరత ఖండమునువదలి మఱియొకద్వీపమునకుఁ బోవలసినయవసరముఁ గలుగదు.

### —ఔషధములు - వానివీర్యము.—

మఱియు నితరవైద్యపద్ధతులవారు దివారాత్రములు వత్స రములకొలఁది మందులఁ జేయుటయందు కాలమును ధనమును వెచ్చించికొనుచుందురు. కడకు సిద్ధమయిన యౌషధము రెండు మాసములకాలముననే వీర్యముచెడి యుపయోగార్హము కాకుం డును. మనయౌషధరాజము లట్లుకాక కొలఁదికాలము కష్టపడి సిద్ధపరచిన నావైద్యపరంపరలోఁ గొన్నివందలవత్సరములుదనుక నుపయోగించుచువచ్చినను నానాటవీర్యవంతములయి లోకో

త్తరముగఁ బనిచేయుచున్నవి. ఈ విషయములను సూక్ష్మదృష్టి కంజూచిన నీయిర్వదియవ శతాబ్దమున నవనాగరక వైద్యపద్ధతుల ననుసరించిన మందులే మంచివియో కొన్ని వేలవత్సరముల కుఁబూర్వముఁ గనుఁగొనఁబడిన మందులు మంచివియో విమర్శకులకుఁ దెలియఁగలదు. మఱియు నెట్టి ఘోరసంగ్రామాదివిపత్తులు సంప్రాప్తములయినను వీరశౌర్యము తటస్థించినను మనమందుల కై ద్వీపాంతరమునకుఁ బోవనక్కఱలేదు. మనము కొలఁదికాలమునకు శరీరపాటవముఁజెడి జరాపీడితు లగుచున్నాముగాని మనమందులుమాత్రము జరావస్థకు వచ్చుకొలఁది నానాట శక్తిహెచ్చి వీర్యవంతములయి శ్రియఃపతియగు ధన్వంతరి యనుగ్రహమును మహర్షుల క్రియానైపుణ్యమును గుణోత్కర్షమును నుద్ఘోషింపుచున్నయవి.

## —౹ ఆంగ్లఆయుర్వేదచికిత్సల తారతమ్యము. ౹—

మాననీయ విద్వత్ప్రకాండులారా! ఋషికులసభ్యులారా!

త్తొల్లింటిమహర్షులు త్రైకాలిక జ్ఞానసంపత్తిచే గనుగొనిన యష్టాంగ విశిష్టాయుర్వేదీయ విషయములు లోకమందంతటను వ్యాపించియుండెను. కొలదికాలముగ నిందలి శస్త్రచికిత్సలకు రాజావలంబనాదులు లేకపోవుటచే వ్యాప్తి తగ్గినది. ఇప్పటి యాచరణములోనుండు కాయచికిత్సలే భారతీయులందరికి నాధారములై యున్నవి. దొరతనమువారు ప్రతివత్సరమును దాడాపు ఒకటిన్నరకోటి రూపాయల

భారతీయుల చికిత్సకై వినియోగింపుచున్నారు. దీనినుండి ఇన్ పేషంట్ స్ (ఆసుపత్రియందుండి చికిత్సనందు రోగులు) 670000 లును, ఔటుపేషంట్ స్ (స్వయముగ ఆసుపత్రికివచ్చి మందులు గైకొనురోగులు) 37159000 లును, చికిత్సనందు చున్నారు. భారతదేశమందుగల ముప్పది (30) కోట్ల జన సంఖ్యలో దాదాపు 372 లక్షల జనముమాత్రమే యాంగ్ల చికిత్సాసాహాయ్యము నందుచున్నారు. మిగిలినవారు దేశీయ చికిత్సల నాధారముగ జేసికొనియున్నారు. ఈవిషయమునే పలు తడవలు భారతసామ్రాజ్య వైద్యశాఖాధికారియగు సర్ పాడీలూ కీసుదొరగారు ప్రకృతము దొరతనమువారు చేయు చికిత్సాసా హాయ్యము చాలదనియు నూటికి 99 మంది దేశీయచికిత్సల నా ధారముగ జేసికొనియున్నారనియుఁ దెలిపియున్నారు. ప్రకృ తము దొరతనమువారధికముగ ద్రవ్యమును వెచ్చించియుఁ దగు చికిత్సాసాహాయ్యముఁ జేయలేకున్నారు. మరియు దొర తనమువారు కేవలము ఔటుపేషంట్సు చికిత్సావిషయమై వెచ్చించు ధనమునుఁబట్టిజూడ నొకరోగికగు ఖర్చు 6-7 అణాలు వ్యయమగుచున్నది. మనదేశీయచికిత్సల నొనరించిన 10 - 12 పైసలు ఖర్చుకాగలదు. మన దేశీయచికిత్సకును పాశ్చాత్యచికి త్సకును గల భేదమునుఁజూడ హస్తిమశకతారతమ్య ముండుననిఁ దోపకమానదు.

దీనినిఁబట్టి దొరతనమువారు చికిత్సకై వెచ్చించు ధన ములో నేకదేశము చే దేశీయచికిత్సలనుండి బీదజనులకు చికి

త్సాసాహాయ్య మెంతవరకుఁ జేయవచ్చునో విజ్ఞానసంపన్నులగు తమకు గోచరము కాగలదు. సులభద్రవ్యసాధ్యమగు నీదేశీయచికిత్సను వృద్ధిఁబొందింపఁ బ్రయత్నములనేకములు దాదాపు గడచిన 30 వత్సరములుగ జరుగుచున్నవి. కొన్ని భాగముల దీని యాదరణ మధికముగ నున్నదియు తమకు గోచరమైనదియే. ఇట్లు పూజ్యంబును ఆర్షంబును బ్రహ్మచారులచే సేవింపదగినదియునగు నీ యాయుర్వేదమును బ్రహ్మచారుల యారోగ్య రక్షణమునకై యుద్ధరించుట బద్ధాదరులగు ఋషికుల మండలివారికి విధియై యున్నది.

—॥ ఆయుర్వేదము—దానశాసనములు. ॥—

విద్యాలయములయందలి విద్యార్థుల యారోగ్యరక్షణమునకై యాయుర్వేదనిలయములస్థాపించి చికిత్సల జరుపుచున్నట్లు తెలుపునవి ప్రాచీనకాలమందలి ఆయారాజుల కాలమున నిర్ణయింపఁబడిన * దానశాసనములు పెక్కుండుకలవు. అందు దృష్టాంతమునకై నొకదానిని తమకు వినిపించెదను :—

మనదేశమున ప్రసిద్ధములగు దేవాలయములన్నియు ఆదికాలమున విద్యాపీఠములుగనున్నట్లు అనేకములగు శాసనములవలనఁ దెలియుచున్నది. అందు చెన్నరాజధానియందలి చెంగల్‌పట్టుజిల్లా, తిరుమకూడల్ గ్రామమున శ్రీవేంకటేశ్వర స్వామి ఆలయము కలదు. ఇందు వేదములు వ్యాకరణము రూపావతారము వేదాంతము మున్నగువాని నభ్యసించు

* వీనివివరములను మాచే విరచితమగు ఆయుర్వేదము దానశాసనములు, అను ప్రత్యేక పుస్తకమునఁ జూడనగును.

60 మంది విద్యార్థులనుగూడిన గొప్పకలాశాల యొకటి కలదు. ఈకలాశాలయందుఁ జదువు విద్యార్థుల యారోగ్యరక్షణము నకుచికిత్సాలయము కలదనియు ఇందు పదునైదుగురురోగులకు అవకాశంబును వత్సరమునకు కావలసిన యిరువదియొకవిధము లగు మందులును ఆతురాలయ నిర్వహణమునకు అశ్వత్థామ కో దండరామభట్టర్ అనువారు [1]కాయచికిత్సకులుగను, ఒక [2]శల్య చికిత్సకుఁడును, ఇరువురు[3]పురుషపరిచారకులు, ఇరువురు[4]స్త్రీపరి చారికలును, ఒకప్రత్యేక పరిచారకుఁడును, ఒకకులాలుఁడును, ఒకరజకుఁడును, ఒకద్వారపాలకుఁడును నియమింపబడిరనియు ఈయాతురాలయమునకు వీరచోళాతురాలయమని పేరుగలిగె నదనియు ఇందలి 1062-67-A. D. కాలమున చోళరాజులలోఁ జేరిన రాజకేసరి వీరరాజేంద్రకేసరిగారిచే నేర్పరుపబడిన దాన శాసనమునుండి తెలియుచున్నది.

—॥ ఆయుర్వేదము - బ్రహ్మచర్యము, దానిమహిమ. ॥—

ప్రియబ్రహ్మచారులారా !

ఇంతదనుక నాయుర్వేదమునుగూర్చి మాట్లాడితిని. ఇక నాయుర్వేదమునకును బ్రహ్మచర్యమునకునుంగల పరస్పర సంబంధమును ఆయుర్వేదముచే బ్రహ్మచర్యమునకుగల్గు ఫల మునుఁగూర్చి యించుక చెప్పెద. మిమ్ముల సావధానులై యాల కింపఁ బ్రార్థించెదను. మనుజసామాన్యముగ జన్మమునకు వాత

1 Physician, 2 Surgeon. 3 Male servent. 4 Nurses.

పిత్తకఫములే కారణములని పైనఁ దెలిపియుంటిని. అందు మను జుల యాయుఃపరిమితిలో ప్రథమభాగమున కఫముయొక్కయు, మధ్యమభాగమున పిత్తముయొక్కయు, అంతిమభాగమున వాత ముయొక్కయు అనుబంధ మధికముగ నుండునని "వయో౽హో రాత్రిభుక్తానాం తే౽న్తమధ్యాదిగాః క్రమాత్" అను వాగ్భటో క్తిచేఁ దెలియుచున్నది. దీనిచే మనుజుని ప్రథమవయస్సు శ్లేష్మభాగమని స్పష్టమగుచున్నది. శ్లేష్మభాగ మధికమైన యీవయస్సు ముఖ్యముగ సత్వగుణప్రధానమగు బుద్ధికిని స్మృతి కిని మేధకును గ్రహణశక్తికినిఁ దగినదని యాయుర్వేదము ఘో షించుచున్నది. శ్లేష్మప్రధానమగు ప్రథమవయస్సు బుద్ధ్యాది వికాసమునకుఁ గారణభూత మగుటంజేసియే ప్రాచీనఋషిపుం గవులు ద్విజాతులకుఁ బ్రథమవయస్సున బ్రహ్మచర్యమును నియ మించి గురుకులవాసముచే నధ్యయనమునుకూడ నప్పుడే చేయ వలెనని నిర్ణయించిరి. అట్టి బ్రహ్మచర్యకాలము జననము మొదలుకొని యెనిమిదవవత్సరము. మొదలుజేసి యిరువదవ వత్సరమువరకు నియమింపఁబడినది.

ఈ పండ్రెండువత్సరములకాలమును బ్రహ్మచర్యమునకు నియమించి అయ్యది వేదవేదాంగాదుల నభ్యసింప నుచితమని నియమించిరి. బ్రహ్మచర్యమున "నేన్ద్రియవశగః ప్రజ్ఞావాన్ కదాపి, సర్వానిన్ద్రియార్థా నగ్నికల్పాన్ స్మృత్వా తేభ్యో నిగృ హ్ణీయాదిన్ద్రియాశ్వాన్ మనఃప్రగ్రహేణ" అను నీ యాయు

శ్వేదీయసూత్రములచేఁ బ్రజ్ఞానసంపన్నుఁడై యొకప్పుడును నింద్రియములకు తా నధీనుఁడుఁగాక యింద్రియములనే గుఱ్ఱములను మనంబను పగ్గముచే నింద్రియార్థములనుండి మరలించి స్వాయత్తములుగ నుంచుకొనుటయని తెలియుచున్నది. చంచలస్వభావమగు మనస్సును ఇన్ద్రియములతోఁగూడి యింద్రియార్థముల వ్యాపింపనీయక వశమున నుంచుకొనుట బ్రహ్మచర్యమని ఫలితార్థము.

అట్టి బ్రహ్మచర్యము సాత్వికాహారసాధ్యము. సత్వగుణప్రధానము. కాయిక మానసిక వాచికములగు హింసాస్తేయాది దశవిధ పాపకృత్యములకును నాశకము. అష్టాఙ్గయోగములకు మూలము. త్రిదోషసామ్యమునకుఁ బ్రథమసోపానము. సామాన్యజనుల కలభ్యము. జనకాదిమహనీయులచే సాధితము. సకలకలావిజ్ఞానసాధనము. శరీరబలదాయకము. విభక్తఘనగాత్రకరమునై బ్రహ్మజ్ఞానమునకు సమీపసాధనమై యుండును.

వ్యాస పరాశరాది మహర్షి తపఃప్రభావముచే పవిత్రితంబై మునిపుంగవుల జ్ఞానజ్యోతితోఁగూడి ప్రకాశించు హిమాచలప్రాన్తమునుండి ప్రవహించు పరమపావనియైన జాహ్నవీతటప్రదేశంబున మనప్రాచీనమహర్షుల సంతతికిం జేరిన కూర్మాంచలభూషణ పండిత దుర్గాదత్తపంత్తు మున్నగు సనాతన ధర్మోద్ధారకులచే నెలకొల్పబడిన యీఋషికుల బ్రహ్మచర్యాశ్రమం

బున మీరు అట్టినియతబ్రహ్మచర్యము నాచరింపుచు గురుకుల వాసముచే వేదాదుల నధ్యయనముఁ జేయుట మిక్కిలి యానం దకరముగ నున్నది. మీరాచరించు నియతబ్రహ్మచర్యముచే వాక్కాయ సత్వశుద్ధులును ధారణాశక్తియు త్రికాలజ్ఞానసంప త్తియు లభింపఁగలవు. ఇట్టిశక్తిని మనవిద్యావిధానమున మహ ర్షులేర్పరచియున్నారు. ఈబ్రహ్మచర్యమే మన యార్యసంతతి యొక్క యౌన్నత్యమునుఁ గాపాడినది. ఈబ్రహ్మచర్యముచేతనే భీమార్జునాదులకు మహత్తరమగు క్షాత్రబలము నిలిచినది. ఇంత యేల? మాయాన్ధ్రావనియందవతరించి కలియుగ భీముడని లోకవిఖ్యాతినొంది లోకమునంగల రాజులచే మెప్పులవడ సిన లోకమిత్రుడగు ప్రఫెసర్ రామమూర్తిగారు చేయు నమా నుషకృత్యముల కన్నిటికిని యీబ్రహ్మచర్యమే ముఖ్యకారణ మని యందరకును విదితమైనదియే.

ఇట్టి పురాతనంబగు నీబ్రహ్మచర్యవ్రతమును ఆర్యసంత తిలోఁజేరిన మీరలు యథావిధిగ నాచరింపుచు సద్గురువులవద్ద వేదాదుల నభ్యసించి వారుపదేశించు "సత్యంవద, ధర్మంచర, స్వా ధ్యాయాన్మాప్రమదః....సత్యాన్నప్రమదితవ్యమ్, ధర్మాన్నప్రమ దితవ్యమ్,...స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్,..." ఇవిమున్నగు నుపదేశములఁ జవదాటక యథోక్తములుగ నాచ రింపుచు; "యే తత్ర బ్రాహ్మణాస్సమ్మర్శినః, యుక్తా ఆయుక్తాః, అ లూక్షా ధర్మకామాస్స్యుః, యథా తే తత్ర వర్తేరన్, తథా తత్ర

వర్తేథాః, అథాభ్యాఖ్యాతేషు.....యథా తే తేషు వర్తేరన్,
తథా తేషు వర్తేథాః" ఇవిమున్నగు నుపదేశముల ప్రకారము
పత్సహవాస సదాచారాదిసంపన్నులై యార్యులకు సనాతన
ధర్మముల నుపదేశించుచు నార్యసంతతికి యోగ్యమగు ధర్మరహ
స్యములను గురుపరంపరగ నుపదేశక్రమమున వృద్ధినొందించుచు
లోకమునుద్ధరింపఁగలరని దృఢముగ నమ్ముచున్నాడను.

ఇట్టి విద్యావిధానము మీకు ఇక్కాలమున లోక
మునంగల సాధారణములగు కలాశాలలయందు అలభ్యము.
అందలి నవనాగరక విద్యావిధానములనుండి బ్రహ్మతేజస్సు
నశించును. గాత్రసౌష్ఠవంబును శరీరారోగ్యంబును దూరమ
గును. ఇయ్యది ప్రత్యక్షము; కావున మీరలు మీగురువర్యు
లచే నుపదేశింపఁబడు నియమములఁ జవదాటక విద్యావిధాన
మును యథావిధిగ బడయుగలరని తలచెదను.

ఆర్యబ్రహ్మతేజస్సంపన్నులారా! లోకమున నేర్పైనను
ప్రమాదవశమున మిథ్యాహారవిహారాదులచేఁ త్రిదోషములు
వికృతినొందుటయు దానంజేసియు పురాకృత కర్మపరిపాకముచే
తను పలుఁదెరంగులగు వ్యాధులు జనించుటయు సహజము. అట్టి
వ్యాధులు మిమ్ముల నంటకుండఁజేయుటకై ఋషికులమువారు
వేదచోదితమగు నాయుర్వేదచికిత్సాలయమును నెలకొల్పను
న్నారు. ఇరువదియవ శతాబ్దమగు నీకాలమునఁగూడ నవనాగ
రక విద్యాపద్ధతుల నవలంబించక యిప్పటికి కొన్ని వేలవత్సర

ములనాడు ఆచారముననున్న వైదికవిద్యాపద్ధతుల నవలంబిం చుటయుఁ దదనుగుణములగు నాయుర్వేదీయచికిత్సల నాచరిం చుటయుఁ జూడ లోకమున నవనాగరకులగు కొందరికిఁ బరిహా సాస్పదముగ నుండును.

లోకమునందంతటను అనార్షవైద్యము విరివిగ వ్యా పించి సులభలభ్యంబునై యున్నది. అయినను ఈచికిత్సలు మన శరీరతత్వములకు అసాత్మ్యములు. వారిచే నొసగబడు నౌషధ ములయందు ప్రాయికముగ నొకయారుఔన్సులపరిమితమున దా దాపు నొకయౌన్సు అయినను 'ఆల్కొహాల్' అను మద్యము క లసియుండకమానదు. ఆమద్యము మన కసాత్మ్యము. మరియు నందుఁగల కొన్ని యోషధులు ద్వీపాన్తరమున జనించినవి. మన దేశపు శీతోష్ణస్థితులకు భిన్నములు. త్రిదోషముల తత్వము నెరింగి తదనుగుణములుగఁ గల్పింపఁబడినవి కావు. అసాత్మ్యం బులును అనార్షంబులునునగు నీచికిత్సలు నియతబ్రహ్మచర్యము నుబూనిన మీయారోగ్యమునకును మీవ్రతమునకును మిక్కిలి విరుద్ధంబులును భంగకరములునని ఋషికులమువారు గ్రహించి మన శీతోష్ణస్థితుల ననుసరించి మనతోఁగూడ భారతమాతగర్భ మున జనించిన యోషధులు మున్నగువానితో నిర్మింపబడిన యౌషధయోగములతో విరాజమానమై వేదచోదితమై భగ వద్దత్తమగు నాయుర్వేదమును అందలి చికిత్సావిధానముల నుండి మీయారోగ్యమును కాపాడుటకు ఆయుర్వేదమహా



విద్యాలయమును తేదను బాధమగు నాతురాలయములను నెలకొల్పి యాయుర్వేదము నభివృద్ధి నొందింపనున్నారనుట మిక్కిలి యానందకరముగనున్నది.

ఋగ్వేదోపవేదమగు నీయాయుర్వేదమునుకూడ మీరలు ఆయా సమయముల నభ్యసించి యార్షవైద్యవ్యాప్తిని కూడ మీరలు భారతదేశమున వెల్లడించుటకై కోరుచున్నాడ. ఈ ద్వాదశవర్ష బ్రహ్మచర్యమునకై నియమితమగు నీకాలమునందప్ప యితరకాలమున నీమారు విద్యనభ్యసించుట దుస్తరము. ఒకవేళ ప్రబలప్రయత్నముం జేసినను ధారణశక్తియున్నను సంపత్తులు లేమింజేసి యావిద్య దృఢముగ నిలిచియుండనేరదు. కావున "శైశవేఽభ్యస్తవిద్యానామ్" అను నార్యోక్తినిమరువక మహర్షిపుంగవులచే నియమితమగు నీకాలముననే ఆయాశాఖలవారికి నియమితములగు విద్యావిధానములం బడయుటలో నప్రమత్తులై "బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యుముపాఘ్నత" అను వేదవాక్యప్రకారము బ్రహ్మచర్యతపోబలముచే మృత్యువునుకూడ తొలగింప సమర్థమగు బ్రహ్మచర్యముననుండి గురుశుశ్రూషాదుల సలుపుచు వేదవేదాఙ్గముల నభ్యసించి సనాతనధర్మమును లోకమున కుపదేశించుటయేగాక భావికాలమునకు మీరలే మార్గదాయకులుగ నుండుటకై మీ కాయారోగ్యముల నొసంగ నాశ్రీయఃపతినిం బ్రార్థించెద.

— ॥ ఋషికుల బ్రహ్మచర్యాశ్రమమండలివారికి విజ్ఞప్తి. ॥ —

ఆర్యఋషికుల బ్రహ్మచర్యోద్ధారకులారా! ఇంతవరకును వైదికమగు నాయుర్వేదముయొక్క యుత్కృష్టతను, దానివలన సులభముగఁ బ్రజలకుఁగల్గు లాభములను, వానినుండి బ్రహ్మచర్య మభివృద్ధిగాంచు మార్గములను సూచించితిని. పరమపవిత్రంబును, వేదచోదితంబును, దీర్ఘజీవనదాయకంబును, బ్రహ్మచారులకు నిత్యాచరణయోగ్యంబును, త్రికాలవేదులగు మహర్షి పుంగవుల తేజోవిలసితంబులునునై యొప్పారు నష్టాఙ్గవిశిష్టంబగు నీయాయుర్వేదమును లోకపావనుడగు భరద్వాజమహర్షి పూర్వకాలమున నేహిమాచలప్రాన్తమున తన శిష్యులగు నాత్రేయాదులకుఁ బోధించి యుద్ధరించెనో ఆయీ హిమాచల ప్రాన్తమునంగల ఋషికులమణ్డలమున వైదిక ధర్మముల నుద్ధరింప బద్ధాదరులగు మీచే నుపక్రమింపఁబడిన యీ యాయుర్వేదోద్ధరణమును త్వరలో నభివృద్ధికిఁ దెచ్చుటకు భగవంతునిఁ బ్రార్థించెదను.

ఈవిషయమై తమచేఁ బ్రయత్నింపఁబడు కార్యములకు భారతజన సామాన్యమువారును దోడ్పడవలయునని యాశ్రియఃపతికి వందనసహస్రముల నర్పించుచు విరమించుచున్నాడ.

ఓమ్ "సహ నావవతు, సహ నౌ భునక్తు, సహ వీర్యం కరవావహై, తేజస్వి నావధీతమస్తు మా విద్విషావహై, ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః"

ఓమ్ తత్సత్.



శ్రీమద్ధన్వన్తరయేనమః

## ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలయందు

## శ్రీమాన్, వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు,

ఎ. వి. ఎస్., ఎ. ఎం. బి. వారిచే సంప్రదాయానుసారముగ

నాంధ్రభాషయందు వ్రాయబడి ముద్రితములై క్రయమునకు సిద్ధముగనున్న

# ఆయుర్వేద వైద్యగ్రంథములు.

---

☞ * శాశ్వత చందాదారులకు మా మాధవనిదానముతప్ప మిగతా పుస్తకములు 100-కి 25-రూ. తగ్గించి ఇవ్వబడును.

---

1. మాధవనిదానము - సంస్కృతము. విపులాంధ్రవ్యాఖ్యాయుతము రోగనిదానాదు [illegible] లందెలుపు గొప్పవైద్యగ్రంథము వెల ... 3 0 0

2. అర్కప్రకాశము - ప్రతిమూలికనుండియు "ఆరకుల" దీయుట కుపాయము లను వానిచే రోగములను కుదుర్చు మార్గములను ఆయుర్వేదపద్ధతి ననుస రించి తెలుపు గొప్పచికిత్సా గ్రంథము. సంస్కృతమునకు విస్తృతమైన యాంధ్ర వ్యాఖ్యానము వ్రాయబడి యున్నది. వెల ... ... 2 0 0

3. ఆయుర్వేదపరిభాష - అనేకగొప్ప ఆయుర్వేద గ్రంథములనుండి సంగ్రహింప బడినది సంస్కృతమునకు చక్కని తెనుగుటీక. ఆయుర్వేదౌషధముల జేయు వారు ముఖ్యముగ నెరుగవలసిన విషయము లనేకము లిందుగలవు. వెల ... 1 8 0

4. రసప్రదీపిక - రసతంత్రప్రక్రియలను బోధించు సుప్రసిద్ధమైన తెనుగు పద్య కావ్యము రసార్ణవాది గ్రంథముల సహాయముచే తేటతెనుగున తాత్పర్యము వ్రాయబడినది ఇందు తెలుపబడియుండు లోహాదిధాతువులకు ఇంగ్లీషు పేర్లు చూపబడియున్నవి. వెల ... ... 1 8 0

5. పథ్యాపథ్యము - సంస్కృతము. విశదమగు తెనుగుతాత్పర్యము వ్రాయబడినది. ప్రతిరోగమునకును హితాహితములగు పథ్యాపథ్యములను దెలుపును. వెల... 1 0 0

6. భేషజకల్పము - వైద్యప్రక్రియలను తెలుపు సుప్రసిద్ధ ఆంధ్రపద్యకావ్యము. అతి విపులమగు నాంధ్రవ్యాఖ్యానము కలదు వైద్యులుమాత్రమేగాక ప్రతి యాంధ్రుడును చూడతగిన యుత్తమగ్రంథము. వెల ... 1 0 0

---

* ఇంతవరకు ముద్రితములును నికమీద ముద్రింపబడు గ్రంథముల నన్నిటిని గ్రహించువారు శాశ్వతచందాదారులుగ నెన్నబడుదురు.

7. దక్షిణభారతము ఆయుర్వేదప్రచారము వెల ... ... 0 8 0

8. అధ్యక్షాభిభాషణములు - "బొంబాయి" "కొల్లంగోడు" లలో జరిగిన ఆయుర్వేద వైద్యమహాసమ్మేళనమునయిచ్చిన ప్రధానోపన్యాసములు. ఇందు ఆయుర్వేద వైద్యక విషయములును అందలి గ్రన్థములును ఆయాదేశముల యందు వైద్యాభివృద్ధియును రాజకీయ వైద్యకశాసనమును విపులముగ విమర్శించబడినవి. ... ... 0 6 0

9. హిందూవిశ్వవిద్యాలయము-గడచిన నూరుసంవత్సరముల కాలములోని వైద్యాభివృద్ధి. ఇది లెఫ్టనెంటుకర్నల్ కే. ఆర్. కీర్తికర్. ఎఫ్. ఎల్. యస్. ఐ. ఎం. ఎస్. (రిటైర్డు) గారిచే సాంగ్లభాషయందు వ్రాయబడినదానికి ఆంధ్రమున పరివర్తితము. ఈగ్రంథనామముచేతనే యిందలివిషయములు సర్వజనవిదితములు. వెల ... ... 0 6 0

10. హిందూవిశ్వవిద్యాలయము - ఆయుర్వేదప్రశస్తి. ఇది మహామహోపాధ్యాయ కవిరాజ గణనాథసేన్, ఎం. ఏ. ఎల్. యం. ఎస్. గారిచే సాంగ్లభాషయందు వ్రాయబడినది. వెల ... ... ... 0 4 0

11. పైదానికి ఆంధ్రమున పరివర్తితము - ఇందు ఆయుర్వేదము ఆధారరహితమగు శాస్త్రము గాద (Scientific) ని తెలిపి త్రిదోషతత్వవినిశ్చయము మొదలగు విషయములు చక్కగ విమర్శింపంబడినవి. వెల ... 0 6 0

12. అగస్త్యవైద్యము - దక్షిణదేశపు వైద్యసంప్రదాయములను బోధించు తెనుగు వచనము. వెల ... ... ... 0 4 0

13. ఆయుర్వేదాంగశల్యతంత్రము - ఆయుర్వేదమున శస్త్రచికిత్స నెట్లు కనుగొనినదియు దానినభ్యసించు మార్గములను బోధించు తెనుగువచనము. వెల ... 0 4 0

14. వస్తికర్మము - "పిచికారి" యొక్క స్వరూపమును దానినుపయోగించు విధమును అందుపయోగింపబడు చికిత్సామార్గములును వ్రాయబడియుండు తెనుగు వచనము. వెల ... ... ... ... 0 4 0

15. ఆయుర్వేదచరిత్రము - ఆయుర్వేదము నందలి విషయములు మొదలగువానిని విపులముగ చర్చించు తెనుగు వచనగ్రంథము. వెల ... 0 4 0

16. ప్రదర్శకాభిభాషణము వెల ... ... ... 0 2 0

17. ఋషికులబ్రహ్మచర్యాశ్రమము - ఆయుర్వేదము. వెల ... ... 0 2 0

18. ఆంధ్రదేశము - వైద్యసహాయము. వెల ... ... 0 1 0

మ్యానేజర్,

టెలిగ్రాఫ్ అడ్రసు, "పండిట్" మదరాస్. } ఆయుర్వేదాశ్రమ గ్రన్థమాలా కార్యాలయము, నెం. ౯౯, ఆచారప్పన్ వీధి, జి. టి. మదరాస్.